# విశ్వవీణ





## మల్లాది రామచంద్రశాస్త్రి



విజయసాహితి — విజయవాడ

# అంకితము.

తను మనసుల నొక
తృణమని యెంచి
కళారాధనమె
ఘనమని యెంచి
కళతో నాద
ర్శము మేళవించి
ఘనయశమును గై
కొన్న నటాగ్రణి,

కలియుగనారద
గైకొను మొసగెద
కైదాల్పుము పట్టి
వీణ గానమున
కావ్యాత్మను అం
కితమొనర్తునే
దివ్యాత్మా! గై
కొను ముపాయనము.

ii

అభినవపాపా

రాయ చిరయశ

స్సమున్నత నీకీ

కృతివిశేషమున

శుభకీర్తి పరి

శోభిత నామా !

సూరి వినుత శ్రీ

సుందర రామా !



# కృతిపతి



కీ॥ శే॥ పిల్లలమఱ్ఱి సుందరరామయ్యాగారు.

## కర్తవ్యము

నిశ్చల మతివై
నిశ్చయ మతివై
నీ కర్తవ్యము
నిర్వర్తింపుము॥
నీ కృతజ్ఞతకు
తా పాత్రముగా
నీ యాత్మోన్నతి
కనువర్తన గా
నీ భవితవ్యము
భాగ్య నేత్రిగా
నిర్మితమీ సచ
రాచర విశ్వము॥
అనలమ్మ నిలము
ఆకసమ్ము భువి
అర్ణవములు నీ
ఆత్మబాంధవులు

# కర్తవ్యము

అనవరత మిమ్ము
    విశ్వ జీవతతి
ననేక రీతుల
    నారాధించెదు॥
నీమది నుల్లా
    సమ్మున నుంచుము
నీహృది నుత్ఫు
    ల్ల మ్మొనరించుము
నీ సౌభాగ్యము
    నిరవధి కమ్మని
నిరతమ్మొద మన
    నమ్మొనరించుము॥



## మా న వు డా !

ఉన్నా డీశుం

డని వచి యించిన

లేడని ఘంటా

పథముగ చాటిన

ఉన్నా రెందరో

దేవత లనినా

దైవత్వమె యా

భ్రాంతి యనినా

సంఘర్షణ త

ప్పదు మానవుడా !

సంక్షోభము త

ప్పదు మానవుడా !—

కుల మతముల ను

ద్ధరింప నెంచిన

కుల మతముల గూ

ల్చగా దలంచిన

# మా న వు డా !

**************************************************

కులమున కన్నిట
    ప్రాధా న్యమ్మన
కులమున కిక ప్రా
    ధాన్యము లేదన
సంఘర్షణ త
    ప్పదు మానవుడా !
సంక్షోభము త
    ప్పదు మానవుడా !--
ఖండమ్ములుగా
    దేశ విభజనను
ఖండమ్ముల నొ
    క్కటి జేసినను
భండనమున కే
    కారణ మున్నను
భండన కారణ
    మే లేకున్నను

సంఘర్షణ త
ప్పదు మానవుడా!
సంక్షోభము త
ప్పదు మానవుడా!
అన్యోన్యము మై
త్రికి యత్నమ్మను
అణ్వ స్త్రమ్ముల
నిర్మాణ మ్మను
అన్య దేశముల
కాయుధ దానము
సైన్యమ్మున విష
సంకలన మ్మిక
సంఘర్షణ త
ప్పదు మానవుడా!
సంక్షోభము త
ప్పదు మానవుడా!—

# మా న వు డా !

మానవుడా ! నీ
మాన వత్వమున
మాలిన్య మ్మె
న్నింత వరకును
మానవుడా ! నీ
మనో భావనను
మహిత మ్మెక రా
నంత వరకును
సంఘర్షణ త
ప్పదు మానవుడా !
సంక్షోభము త
ప్పదు మానవుడా! —



## ఆ త్మ గీ త

లేదు నా కనురక్తి
　　లేదు నాకు విరక్తి
లేదు లేనే లేదు
　　లేదింతయును సక్తి.
లేదు నాకు నిరాశ
　　లేదు నాకు దురాశ
లేదు లేనేలేదు
　　లే దొకింతయు నాశ.
లేదు భుక్తికి చింత
　　లేదు యుక్తి యొకింత
లేదు లేనేలేదు
　　లేదు ముక్తికి వంత.
లేదు బాంధవ మింత
　　లే దబాంధవ మింత
లేదు లేనేలేదు
　　లేదు బంధ మొకింత.
లేదు కానిదినాది
　　లే దైనదియు నాది
లేదు లేనేలేదు
　　లే దన్యముగ నేది.

# ఏ మే మే మో !

అర నిముసమ్మున
నా జననం
మరు నిముసమ్మున
నా మరణం
అనుభవ మప్పటి
దేమో యేమో !
కననా విననా
నే మే మే మో !
క్షణము గతించిన
ఆపై నాపై
అనుగతమౌ విగ
తమ్మౌ నేమో !
అనుకూల మ్మ
ప్పటి కే మౌనో ,
అనుభూత మ్మే
స్వగత మ్మౌనో !

ఇప్పటి నా యె
ప్పటి కెటు లుండునో !
ఇప్పటి నే నె
ప్పటి కెటు లౌదునో !
ఎప్పటి కే యను
భవ మెటు లౌనో !
ఇప్పటి యీ యను
భవ మెటు లుండునో !—
ఏ చూపున కే
పదు నేర్పడునో !
ఈ చూపున నిం
కేమా ర్పొదవునో !
ఈ యాలోచన
మవు డెటు లుండునో !
ఏ యాలోచన
మవు డెటు లౌదవునో !—



## ఎవ రోయి !

ఎవ రోయి !
    ఎవ రోయి
అరులు నీ
    కెవ రోయి !
వివరముగ
    యోచింప
పరు లెవరు
    కా రోయి
సరిజా
    రనుచు వీరు
పెరవా
    రనుచు వారు
సరిగాని
    భావనను
పరికింప
    దగ దోయి

# మనవిమాటలు

శీతవాతాతపములనుండి రక్షణకొఱకు, క్షుత్పిపాసలు తీర్చుకొనుటకు మానవుడొనరించు యత్నమున నాతని సహజ వస్తుగుణ పరిశీలనాసక్తి విశేషముగ వివిధములగు భౌతికశాస్త్రములు వెలసినవి. శక్తిగా నదృశ్యమును వస్తువుగా దృశ్యమును అగు జగత్తుతోను, జగజ్జీవముతోను వ్యక్తికిని, వ్యక్తిజీవమునకునుగల సంబంధ విచారణమున వివిధానేక తత్త్వశాస్త్రములు బయలుదేరినవి. పిపీలికాది సర్వజీవ లక్షణమయ్యును మానవునిలో పరిణతి నందిన రసపిపాస, సౌందర్యతృష్ణ తదన్వేషణయత్నము ఫలితముగ కవితాదులగు కళ లుద్భవించినవి. సమగ్ర మానవ జీవనతరువున నివి శాఖామాత్రములు. వీనియందేకొలదిగనో అభిలాషయుండని మానవులు అరుదుగనైన నుండరు. ఒక్కొక్కరి కొక్కొక ప్రత్యేకశాఖపై మక్కువ మిక్కిలి గావచ్చును. అంతమాత్రమున వీనియం దేది యెక్కువ ప్రాధాన్యముగలది యేది తక్కువ యను విచారణ జేయ బూనుట సమంజసము కాజాలదు. ఆకలిని తీర్చుటలోను, వ్యాకులతను మాపుటలోను భౌతికశాస్త్రజ్ఞానము పర్యవసితమగుచున్న కళాభిజ్ఞత ఆనందరస పర్యవసాయి యగుచున్నది. ఇందెక్కువ తక్కువలకు తావెక్కడ?

యుక్తాయుక్తవివేచనము, అలౌకికానందానుభవము అనితర జీవసామాన్యమై మానవునికి ప్రత్యేకవైలక్షణ్యమునొసంగుచున్నవి. పంకసంజాత పద్మమువలె పార్థివమగు శరీరావలంబనమున మానవ హృదయ కమలము వికసించి విశేష మాధురీ కలితాంతః

పెరవా
        రెవరు లేరు
సరి వారె
        యెల్లరును
వివరమ్ము
        గా నీవు
అరయ జా
        లుదు వేని
అంతమే
        లేని యీ
వింతయౌ
        కా లా బ్ధి
నెవ రెవరు
        యెపు డెచట
నెవరి నెటు
        కలియుదురో !—



# ఉన్న దింతే

ఉన్న దింతే
ఉన్న దింతే
మన్ను ఆకా
శమ్ము గాలి
ఇన్ని నీళ్ళు
ఇంత నిప్పు
ఇంతతో నెం
తెంత వింతలు!
విన్న దంతయు
కన్న దంతయు
ఉన్న దంతయు
వేయి విధముల
తిన్నగా యో
చింప నిదియే
ఎన్న దేనియు
ఎవ్వ దేనియు

ఇన్ని విధముల
    మార్పునకు ఏ
మున్నదో చి
    త్రమ్ము దానిని
ఉన్న దున్న
    ట్లుగను మరియ
ట్లున్న హేతువు
    నెన్న జాలరు.
కన్నులకు కన
    రాక మనసున
కెన్నగా శ
    క్యమ్ము గాకను
సన్నుతికి పా
    త్రముగ నేదో
ఉన్న దంతట
    నద్భు తమ్ముగ.



# విచిత్ర శిల్పి

శూన్యమ్ములో నుండె
　　సూర్యుని చంద్రుని
చుక్కలను వెలయించె
　　చిత్రమే శిల్పియో !
అన్య మొకటియు లేక
　　అన్నియును తానుగా
అన్ని తనలోను గా
　　నిన్ని రూపు లొనర్చె.
గిరులలో ఝరులలో
　　తరు లతాదికము లో
పొరివోని యందమ్ము
　　వరలించె నద్భుతము !
మలయానిల మ్మొసగు
　　మధురోచ కమ్మునిడు
మహిత ఫలము లొసంగు
　　మహిమాన్వి తుండతడు.
తనివి తీరను తినగ
　　వినగ కనగను మనగ
మనన మ్మొనర్పగా
　　తను వొసగె మన మొసగె॥



## వి చి త్ర జ గ తి

కడు విచిత్రము జగతి

కనరాదు ముందు గతి

కమనీయతనె కాంచునో

బ్రతు కింక

కర్కశతనే గాంచునో ॥

ఆశలూరగ హృది వి

కాస మొదవగను మది

ఆకాంక్ష మిన్నంటునో

జీవితము

ఆశయ మ్మడు గంటునో ॥

బ్రతుకువెత దీర నవ

గతి నందుటకు ముందు

పుష్పహారమె యమరునో

అడుగులో

బుసలిడుచు ఫణి నిల్చునో॥

—oo:o:oo—

******************************************************

## ఇంత యె చాలును

ఆస్తిక్యమొ

నాస్తిక్యమొ

విస్తారం

నా కెందుకు ,

నా కింతయె

చాలును ఇక

ఇకనా కిం

తయె చాలును.

ఆకసమంతట

నటు నిటు

నగణితమౌ

తారకలెప్పు

డే కృతజ్ఞ

తను గోరక

తేకువ నిడు

జగ మంతకు.

******************************************************

# వి శ్వ వీ ణ

ఒక సూర్యుడె
    సకలమునకు
విశదమ్ముగ
    వెలు గిచ్చును
ఒక చంద్రుడె
    సక లావని
నిఖి లోషధు
    లను పెంచును.

అనిలము ని
    ల్పును ప్రాణ
మ్మన్నిటికో
    నొక రీతిని
అనలమ్మోస
    గును దీప్తిని
అన్నిటికి నొ
    కే రీ తి ని.

## ఇంత యె చాలును

***

అల్ప మొకటి

   కానరా ద

నల్పమ్మొ

   క్కటియు లేదు

అన్నియు నిక

   నల్పములే

అన్నియును అ

   నల్పములే.

జగమంతా

   చైతన్యం

జగమంతా

   జీవమయం

జగతినిగల

   జన మొకటే

జగతిని జీ

   వమ్మొకటే.—



***

# వెళ్లిపోదును

వెళ్లిపోదును
వెళ్లిపోదును
చల్లగా నే
వెళ్లిపోదును
ఇల్లు వాకిలి
విడిచి యెచటికో
ఎల్ల కాలము
నకో యేమో॥

బాధలన్నిటి
ననుభవించి
గాధలను నా
మది గలంచి
వాదనలతో
విసిగి వేసరి
వేదనల నే
నవికి చివికి॥

# వెళ్లి పోదును

ఎవరు మిగిలిరి ?
    అరుగకచటికి
ఎవరి కెవ్వరు ?
    అరుగనచటికి
మరల నేరూ
    పయన వత్తునో
తిరిగి రానో
    అరసి రెవ్వరు ?॥

కాలగతి అం
    దరకు నొకటే
మేలు కీడు ల
    వన్ని యొకటే
ఏలాకో సమ
    దృష్టి నరయరు
కాల మరుగక
    మేలుకొందును॥



కరణముగ సమార్ధనమై అతిలోకావలోకన శక్తినంది లౌకికాలౌకిక దర్శనముల రమణీయముగ లోకమునకందింపజాలుటయె కళా రహస్యము. ఇందే కళాశిల్పి యుత్కృష్టత గాననగును.

తన్మయతానందము కలుగుచున్నది. ఆవేశము తన్మయతకు హేతువగుచున్నది. తన్మయత అనుభూతి పరమార్థము. ఈ దశలో వ్యక్తి తనను, తన పరిసరములను మరచుచున్నాడు. ఒక యౌగికస్థితియందు అనుభూతి విషయము రూపు ధరించుచున్నది. అనుభవము వ్యక్తి సంబంధి. తనకొఱకైనదే. తనకై యానందించుచున్నాడు, విలపించుచున్నాడు, ఆరాట పడుచున్నాడు. తన కొఱకే యిది యంతయును జరుగుచున్నది. అనుభూతికి వాగ్రూప మిచ్చిన తరువాత అది లోకస్థితి కరుదెంచుచున్నది. ఈ అనుభూతికి వాగ్రూప మియ్యఁగలవాఁడు కవి.

కనులు గాంచలేని
    దృశ్యములగన
వీనులు వినజాలని
    శబ్దమువిన
మానస మూహించని
    మహిమనుగన
మానవ జాతికి
    మార్గదర్శి కవి.

దృశ్యప్రపంచమెల్లర కొక్కటేయయ్యును ద్రష్టల దృక్పథముల ననుసరించినదై వారివారికి భిన్నరుచులతో, రూపములతో దృశ్యమగుచున్నది. ఒక వస్తువును చూచినంత నొకనిని దానియంద మాకర్షించును, వేరొకని మానసమున వస్తుతత్త్వ విచారణ మారంభ

# స మ ర్ప ణ ము

ఇదె
నా హృదయం
అర్పణ చేస్తా
భవిష్య మానవ
కల్యాణానికి.
ఇదె
నా హృదయం
తర్పణ మిస్తా
పూర్వోన్నత భా
వాన్విత జనులకు.
ఇదె
నా హృదయం
అంకిత మిస్తా
వర్తమాన వి
శ్వ జీవరాశికి.

నా సానుభూతి
సర్వత్రా
నా త్మానుభూతి
సర్వత్రా.

# సమర్పణము

ఎందరి సాయ

మ్మున నే నుంటినో

అందని విషయం

ఆలోచన కది

అందరి కీక నా

డెంద ముపదగా

నుందు నమందా

నందము గూర్చుచు

నా సానుభూతి

సర్వత్రా

నూత్నానుభూతి

సర్వత్రా.



## అ ద్భు త శ క్తు లు

ఆ ది త్యాం త
    ర్వ్యా సి ని
అహ మొక టే
    కల దచ్చట
ఈ దెస భా
    వనచే నిట
నహోరాత్ర
    ముల నరసితి.

ఉన్నారతి
    చిత్ర దేహా
లుత్త యెండ
    కే యోర్వరు
ఉ ష్ణా ధి
    క్యమ్మున నెటు
లుండ జాలు
    దురు మీరిక.

ఊహ పద్ధ

తే వేరిట

ఉండి తీర

వలయు దేహ

మేదో ని

ర్దిష్టత నిట

లేదు మాకు

దేహ మిటుల.

కనుగొన జా

లరు మము మిము

కనుగొన జా

లదుము మేము

కంటను వీ

క్షింతు రిలను

మింటను మే

మటు జూడము.

కను మరుగున

మీ రెరుగరు

కను మరుగును

మే మెరుగము

కాయము లే

దనుట తగదు

కాయము భా

వమె మాకగు.

లో లో నర

యగ దోచును

లీలగ నిల

మని నట్టుల

చాలగ విహ

రింతు మిపుడు

గోళము లె

న్నిటనో మేము.

అడ్డు వార
    లెవరు లేరు
వద్దిట పో
    మ్మన జాలరు
బుద్ధి మంతు
    లెవరో మా
సద్దు నరయ
    జాలు వారు.

ఈ తనువున
    నే యనువున
నే గన విన
    గను జాలరు
మీ కను లర
    యమి చేతను
మా కను విం
    దును గాంచవు.

అంతులేని

వింతల కెపు

డాలవాల

మౌ గ్రహతతి

యాలోకన

మున నందెద

మమంద మౌ

నానందము.

ఏమని వచి

యింతును నే

నా మహిమా

తిశయమ్ముల

భూమియౌను

పరమాణువు

భూమము లో

గ్రహ రాసుల.

గ్రహముల నె
న్నగ శక్యమ ?
గ్రహ శోభ ను
తింప వశమ ?
గ్రహకర్త నె
రుంగ దరమ ?
గ్రహగతి సక
లము చరించు.

భావ కాయ
మగుటను మా
భావన నె
న్నో గాంతుము
భావము కం
దకను పైన
భాసించు న
నంత మ్మగ

విశ్వావధి
    గాంచితి మని
ఉక్త మాట
    నుడువ జాల
మిథ్యా శ
    క్తిని యెల్లెడ
స్వేచ్ఛగను చ
    రింతు మంతె.

ఇంతటి మా
    కును మీకును
అంతర మిక
    కొంత వఱకే
శక్తి యుతులు
    వ్యక్తు లీరు
శక్తియె మా
    వ్యక్తిత్వము.



# హృదయ వీణ

కన్నుగవ దోచు నొక

కారుణిక భావమ్ము

భావ వీచిక నూచు

పావనోచ్ఛ్వాసమ్ము

ప్రాలేయ శీతలా

లోల విన్యాసమ్ము

నీలాంబర స్థలీ

లీలా విలాసమ్ము

చాలు నా హృదయ తం

త్రుల మీటగా

చాలు నానంద నృ

త్యము చాటగా—

విమలాంబు పూర ని

ర్ఘరిణీ నినాదమ్ము

కమలినీ శతపత్ర

కమనీయ విభవమ్ము

మగును. ఇంకొకరికి స్రష్టకౌశలమునుగూర్చిన యాలోచనముద యింపవచ్చును. వస్తు వొకటియేయయ్యును తదాలోచనము స్రష్టల మానసముల జనించు నూహలు వేరగుచున్నవి. సృష్టి విషయము నను ఇంతియే. ఒకనిది రమ్యాలోకనము. ఇంకొకనిది తత్త్వ దర్శనము. వేరొకనిది శాస్త్రసృష్టి. ఇవన్నియును ప్రతి యొకరి యందును కొంతకొంతగ నుండవచ్చును. ఒక్కొక్కనియం దొక్కొ-కటి ప్రాధాన్యము వహించియుండును. కొందరికి నేయూహయు కలుగక పోవచ్చును.

ప్రతిభావంతు లగువారు తమ చిత్తపరిపాకమును, అభిరుచిని అనుసరించి చేయు సాధనాఫలితముగ నిర్బద్ధమై రమణీయార్థ ప్రతిపాదక శబ్దభరితమగుచో నదియె కవిత్వమును, కావ్యమును, రమణీయాకృతినందిన కృషిఫలితమే చిత్రమును, శిల్పమును నగుచున్నది. వస్తుస్వరూపమగుచు వస్త్వతీత భావజ్ఞాన సంబంధియగు దర్శనము తత్త్వమును, వస్తువిమర్శన, విశ్లేషణ, పరివర్తనముల సంబంధ మాత్రమగు చూపు శాస్త్రమును సృష్టించుచున్నది. మానవుల మానరేఖా విలాసములలో నెట్టి తారతమ్యములు కన్పట్టుచున్నను శరీరావయవ నిర్మాణవైఖరియు, కూర్పును ఒక్కటియేయైనట్లు మానవాంతఃకరణమున నేకత్వము ప్రతిష్ఠితమై యున్నది. ఆ యేకతయే లోకవ్యవహారమున నొకరినొకరు తెలిసికొన జాలియు నలౌకిక వ్యాపారమున సహృదయానందమున నేకము కాజాలియు నున్నది. అందువలననే రసానంద పరవశుడై దానిని వ్యక్తీకరించ గలిగిన మానవుడు ఇతరుల నానందింపజేయ గలుగుచున్నాడు. అట్లే శోక విహ్వలుడు శోకింపను చేయగలడు.

వర్తమానమునుబట్టి భవిష్యమును, ప్రత్యక్షమును గాంచి పరోక్షమును మానవు డూహించుచున్నాడు. ప్రత్యక్షమగు నింద్రియ

***********************************************

ప్రచలితానూనాను

రాగ రస లేశమ్ము

విచలితాశాలేశ

విమల ప్రకర్షమ్ము

చాలు నా హృదయ తం

త్రుల మీటగా

చాలు నానంద నృ

త్యము చాటగా—

శరదిందు చంద్రికా

తరళ లావణ్యమ్ము

విరళ సౌభాగ్య వి

స్ఫుర దారుణాంశమ్ము

తరులతా గుల్మ సుమ

కలితోరు వైభవము

సరస సాహిత్య సుమ

సౌరభా మోదమ్ము—

***********************************************

చాలు నా హృదయ తం
త్రుల మీటగా
చాలు నానంద నృ
త్యముచాటగా—

లలిత లావణ్య ల
క్షణ లక్షితాననము
కలిత విభవౌన్నత్య
కమనీయ భాషణము
చలిత విద్యుల్లతా
విలసితాంబర తలము
ఫలిత కేదార ద
ర్శన సముత్సాహమ్ము
చాలు నా హృదయ తం
త్రుల మీటగా
చాలు నానంద నృ
త్యము చాటగా—

గాలి తరగల మంజు

గాన మాధుర్యమ్ము

గ్రోలి పైపై నాడు

నీలాంబుద చయమ్ము

జాలిగుండెల కరుణ

ద్రావి యానంద రస

డోలికల నూగు నా

బాలక క్రీడలు

చాలు నా హృదయ తం

త్రుల మీటగా

చాలు నానంద నృ

త్యముచాటగా—



# అ ను సం ధా న ము

దీక్షగ సుకృతా

త్ముల భావింతును

అక్షర సుమ హా

రము లర్పింతును

సాక్షిమాత్ర భా

వన వీక్షింతును

అక్షీణానం

దమును పొందుదును.

జీవనమున నే

కృతుల రచింతును

భావమునను పా

డుచు మరణింతును

జీవితమే కవి

తాను భూతిగా

జీవింతును భా

వింతు రచింతును.

# వి శ్వ వీ ణ

అణువుగ నే నవ
        లోకించెద నీ
యవనిని కను న
        ప్పుడు విశ్వమ్మును
విశ్వ వల్లకీ
        నిక్వణమున నే
శ్రుతి గల్పుదు
        హృదయతంత్రి మీటుదు.

అత్యంతానం
        దమె నాకెప్పుడు
ఆర్తినెరుగ నిసు
        మంత నే నెప్పుడు
జీవితమును మిం
        చిన భావములో
జీవింతును లేదు
        మరణ మెన్నడు.



# మ హ ర్షీ!

పు ట్ట యె ం త
　　ధన్యమైన దయ్యా !
పట్టిగ నిను చే
　　పట్టిన సుకృతిని
ముట్టిని బుట్టియు
　　మధుర భావముల
పట్టుగొమ్మ వై
　　తివి వాల్మీకీ !—

ఉదయభాను తే
　　జమె రూపముగా
ముదిత కౌముదీ
　　హాసమె మదిగా
ఋక్షము లక్షయ
　　భావమ్ములు గా
సృష్టించె విధాత
　　నిను మహర్షీ !

మృదు మంజుల
        శైలీ విభుడవు
మధు భావ వి
        మోహన మూర్తివి
విదితమైన యా
        గమ రహస్యముల
మధుర గాథ విర
        చించితివి ఋషీ !

సేతు శీతనగ
        పర్యంతా
లోకన నీకాక
        క్షణమాత్రమ్మగు
లో కా లో క
        మ్ములను నిమీలిత
లోచనముల ద
        ర్శించితివి ఋషీ !

గత మెరిగితి వా

గతము దలచితివి

అనాగతము కథ

గా నొనర్చితివి

ఋషివై కవితా

గానము సల్పితి

వనమానము నీ

ప్రజ్ఞ మహర్షీ !

ఏకైకము బ్రహ్మ

వస్తు దీప్తము

సాకారము నీ

కృతి స్వరూపము

లోకము మారిన

నైన కాలమున

నేకాకృతి యై

నిల్చు మహర్షీ !—

—০০:৹:০০—

## ఓ వ్యాస మహర్షీ !

భారతమున
విశ్వము నింపిన
భవ్యాత్మా ! సుకృతీ !
వ్యాసర్షీ !
దినకర శశి తా
రకల మనుగడను
కను నీకీర్తి ప
తాక మహర్షీ !

మతి విభవము
చరమసీమ గాంచిన
అతిలోకము
సత్యము దర్శించిన
స్తుతమతి వై
వేదము విభజించిన
పటుశక్తి పురా
ణముల రచించితి॥

# ఓ వ్యాస మహర్షి

దైవికమౌ శక్తి
ప్రాభవము గని
మానుష శక్తుల
మహిమను కనుగొని
మానస తత్త్వ
గాధములకు జని
మహితాత్మత విర
చించితివి ఋషీ !
మానవ హిత
సారస్వత శిల్పము॥

అర్థనీతి రాజ
నీతులను పర
మార్థనీతి సం
కలన మొనర్చితి
వర్థకామ ఫల
సిద్ధుల ధర్మము
మోక్షదమని ప్రవ
చించితివి ఋషీ !॥

జనిత జ్ఞానమే సత్యమనియు తదన్యము తద్వ్యతిరిక్తమనియు నిర్ణయింపబూనుట వివేకయుతము కాదు. ప్రత్యక్షజ్ఞానమొకానొక ఖండస్థితికి సంబంధించినది మాత్ర మగుచున్నది. దాని యవధి నతిక్రమించిన చూపునకది యజ్ఞానగ తోచుట సహజము. బహువిషయ పరిజ్ఞానము మానవమేధ నతీంద్రియ జ్ఞానపరిసరములకెత్తజాలు పరిమిత ప్రజ్ఞావహమేగాని అతీంద్రియ జ్ఞానదాయిని కాజాలదు. అతీంద్రియ జ్ఞానోదయమున వ్యక్తి విశ్వశక్తిప్రవాహము స్పృశించుచున్నాడు. కళాతపః ఫలసిద్ధి యచటనే. అరువది నాలుగు కళలును అఖిలేశ్వరుని ఆరాధనమునకు. ఇదియ భవ్యభారతీయ కళాలక్ష్యము.

ఈ విశ్వవీణ యందలి కొన్ని గేయములు పరిసర ప్రభావ జన్యములు. మరికొన్ని విశాల విశ్వావలోకన సముద్భూతములు. వేరు కొన్ని అంతరవ లోకనా సంజనితములు. మొత్తమున నివి ఆర్ష విజ్ఞానవైఖరీ సముపేతములు.

అభినవ పాపారాయ, కలియుగ నారద బిరుదాంకితులు, సుప్రసిద్ధినందిన కళావిదులు, నటశేఖరులు సహృదయులునగు కీ॥ శే॥ లగు శ్రీ పిల్లలమర్రి సుందరరామయ్యగారి పవిత్రాత్మకు ఈ విశ్వ వీణ నంకితమొనర్చి నా హృదయ మానందపరవశమగుచున్నది.

ఈ వీణానిక్వణమెందరి హృదయముల నెంతగ నలరించునో నన్నంత భాగ్యవంతునిగ భావించుకొందును.

“జయన్తి తే
సుకృతినో
రససిద్ధాః”

మన్మథ
పుష్యపౌర్ణమి

సెలవు,
మల్లాది రామచంద్రశాస్త్రి.

నిధనము శ్రేయము
　　నిజ ధర్మముననే
పరధర్మము కడు
　　భయావహమ్మని
నిజ ధర్మాచర
　　ణము పురిగొల్పిన
నిశ్శ్రేయస పథ
　　దర్శీ ! మహర్షీ !॥

చ తు ష్ష ష్టి
　　కళల కవిత నింపితి
నవరసముల
　　పరిపుష్ట మొనర్చితి
నవనవ రీతుల
　　నవ కల్పన మున
పురాణమును చిర
　　నవీన రచనమొ॥

# ఓ వ్యాసమహర్షి

జ్ఞానధనుడ ! వి
జ్ఞాన ఘనుడ ! నిజ
తప స్తేజ వి
భ్రాజిత యశుడా !
కృష్ణద్వైపాయన
నామాఖ్యుడ !
భగవానుడ !
ఓ ! వ్యాసమహర్షి !!!



## మ హా క వీ !

విశ్వ మానస
    మ్మలరె నితాంతము
పుష్ప మొకటి
    వికసించెను భువిలో
దివ్య పరిమళో
    పేతము నవ్యము
భ వ్యా కృ తి
    కాళిదాస రూపము

శైశవమున
    విద్య నభ్యసించిన
యౌవనమున
    విషయ సుఖముగాంచిన
వార్ధకమున
    ముని వృత్తిజరించిన
మధుర భావనము
    నను మహివీడిన

# మ హా క వీ !

********************************************

ఎన్ని జన్మముల
సుకృతమో ఆకృతి
కన్నది భారతి
పున్నెము పంటగ
కవికుల గురు
డుదయించె జగమ్మున
కా ళి దా సు డు
మహానుభావుడు.

వాల్మీకి వచో
వైభవ సారము
వ్యాసర్షీంద్రుని
ఆర్ష సంపదయు
జన్మసిద్ధముగ
కళాభిజ్ఞతయు
అమరిన వెంతటి
భాగ్య శాలివో :-

********************************************

సర్వ శాస్త్రముల
సార సంగ్రహము
సర్వకాల విష
యావగాహకము
సర్వ కళావై
భవ సంపన్నము
శ్రుతి హితమౌ నీ
కృతి మహాకవీ !—

ఎంతదాక శబ్ద
రుచిని వీనులు గను
ఎంతదాక మన
మున్నతి కన్గొను
ఎంతదాక మా
నవహృది నార్ద్రితమను
నంతదాక నిల్చు
కృతుల నొసగితి

వంతులేని దీ

పుణ్య విశేషము

ఎంతటి సుకృతివి

మహాకవీ ! మే

మెంత ధన్యులము

మ హా క వీ !



## భ వ భూ తీ!

నిండుమనము నవ
నీత సమానము
పండువంటి చాయ
మేను, హృదయము
నిండుగాను కరుణ
శ్రవణ కుండల
మండిత మా ముఖ
తేజము తెల్పును

పండితకవి యిత
డౌనని యూఢిగ
కంఠసీమ రు
ద్రాక్షమాలయును
కట్టిన నీర్కావి
రంగు దోవతి
వలెవాటుగ వై
చిన శాలువయును

## భ వ భూ తీ !

చెలువమ్మౌ నం
    గుళిని దర్పముడి
అటనట దేహము
    నను ముఖమంతట
నలచిన విభూతి
    శోభ గూర్చినవి.

కరుణార్ద్రిత
    రాలను కరగింపగ
కన్నీటను
    కాలాగ్ని నార్పగా
కరుణ ఏవ
    ఏకోరస మనగా
ఘనుడీతడు
    చాలునంచు తోచును.

....    ....    ....    ....

ఎవరో నీతడు
    మరచితి నింతనె !

అవునా ఋషి !

ఏమో ? ఇతడుత్తర

రామచరితము

వ్రాసినాడు కవి.

" ఉ త్త రే

రామచరితే

భ వ భూ తి

ర్విశిష్యతే "

అరె ! క్షణమాత్రన

జ్ఞప్తికి వచ్చిన

దాశ్చర్యము మది

త్రుటి నెటకేగునో

మరుక్షణమున నెటు

మరలి వచ్చునో

అరయ జాలరెవ

రీ వివరమ్మును.

.... .... .... ....

## భ వ భూ తీ !

సానుభూతి నీ
    తమ్మును గని తా
నెంతగనో విల
    పించి నాడితడు
కవి హృదయము
    శోకతప్త మగుటను
కుమిలిన వార్తిని
    చరాచరమ్ములు.

....    ....    ....    ....

కరుణ ఏవ
    ఏకోరస మను నీ
ఘనత కివే
    మా నమోవాకములు
భవభూతీ !
    అనుభూతి విశేషత
కవితా విశ్వ
    విభూతి నొసగితివి—

## విజ్ఞప్తి

"కోహినూరు వజ్రముతో నొక
కోమలభావము నెన్న మిన్నయౌ
ఉన్నత భావోపేత రసాన్విత
కావ్యమ్మున కిల సాటికల్గునే!"

బుద్ధికి పదును హృదయమునకు సంస్కారము కలిగించి ఇహపర చింతనము నొదవించు జ్ఞాన విజ్ఞాన సమన్వయకరములగు రచనలతో సరస్వతీపూజ సల్పుట మా విజయ సాహితి పరమలక్ష్యము.

నవల, నాటకము, కథానిక, గేయము, కావ్యము, మున్నగు సకల సాహితీ తరుశాఖల విస్తరణమున ఆంధ్రావని యుల్లము పల్లవించు చల్లదనమును సమకూర్చుట మా ఆశయము.

ఉడుతాభక్తిని మా చేయు కృషికి సహకరించి తగు ప్రోత్సాహము నొసంగ వలసినదని ఆంధ్ర మహాజనుల నభ్యర్థించుచున్నాము.

మా విజయ సాహితి వినయ వినమితయై సమర్పించు తొలి కానుక ఈ విశ్వవీణ.

విజయవాడ
పుష్యపౌర్ణమి
౨౭-౧-౫౬

మల్లాది కృష్ణప్రసాద్,
సంపాదకుడు,
విజయ సాహితి.

కా ళి దా సు

స్మరణము తోడన నీ

కావ్య శిల్ప

నిర్మాణ మరయుదురు

కరుణార్ద్రిత

కనులు చెమ్మగిల్లును

భ వ భూ తీ :

నిను భావించగ మది.—



## జ య దే వా !

జగ మాక్షణమున
　　చైత్రరధమ్మగు
కాలమౌను ఏ
　　కైక వసంతము
కవిఙౌ నాతడు
　　జయదేవా ! నీ
పదమును రసనా
　　గ్రమున నిల్పగను.

.... .... .... ....

యమునా తీరము
　　నను వనమాలీ
కమనీయ విహా
　　రము కనుగొంటివి
కరతల తాళ
　　తరళ వలయావళి
కలితవేణు కల
　　నాదము వింటివి

జయ

జయదేవ

కవీ!

లలిత పద

జయశీలీ

ప్రతిభా

శాలీ!

గోపీ పీన

పయోధర మర్దను

గోప బాలు

రసికత నరసితివి

రతి సుఖసమయ

రసాలసతను దగ్గ

ముకుళిత నయన

సరోజునిగంటివి

# జయ దేవా!

జయ
జయదేవ
కవీ!
లలితపద
జయశీలీ!
ప్రతిభా
శాలీ!—

చందనచర్చిత
నీల కళేబరు
పీత వసను
వనమాలి నరసితివి
నంద నందనుని
సుందరా కృతికి
వందన సుమహా
రము లొసంగితివి.

జయ

జయదేవ

కవీ!

లలితపద

జయశీలీ!

ప్రతిభా!—

శాలీ!—

లలిత లవంగ

లతా పరిశీలన

నలసితివా?

సుకవీ! జయదేవా?

లలితలలిత మీ

పద విలసనమున

చిలుకరింతు

పన్నీరు లలితతను

## జ య దే వా !

*********************************************

జయ

జయదేవ

క వీ !

లలితపద

జయశీలీ !

ప్ర తి భా

శా లీ !—

కుసుమశరుడ వా

కృతి విశేషమున

కవికుమారుడవు

కృతికల్పనమున

గాయకుడవు శృం

గార భావనల

రససిద్ధిని పొం

దితి వానందము

*********************************************

జయ

జయదేవ

కవీ!

లలితపద

జ య శీ లీ!

పద్మావతీ చరణచారణ చక్రవర్తీ!

విద్యానవద్య సుమనోజ్ఞ మతిప్రదీప్తా!

అజ్ఞాన గాఢ తిమిరాపహ బాలభానూ!

సుజ్ఞాన కాంతి పరిదీపిత చిత్తపద్మా!

జయ

జయదేవ

కవీ!

లలితపద

జయశీలీ!

ప్రతిభా శాలీ!

## ఆ ది క వీ !

ఆంధ్ర సరస్వతి
పున్నెము పంటవు
ఆంధ్రుల చిర తప
మునకు ఫలమ్మవు
ఆంధ్రకవుల కె
ల్లర కారాధ్యుడ
వార్షమతీ ! సుకృతీ !
మహాకవీ !-

దర్శించితివి శారదనిశలలో మహో
జ్జ్వల తారకాహార సంతతులను
వీక్షింతివి ఘనవిపినసీమల లోన
సాధుఋష్యాశ్రమ సముదయములు
కనుగొనినావు నిష్కలుషాంబు సంపూర్ణ
కాసారములు సాంద్రకాననముల
వినినావు శుకపిక వివిధమంజులరుతి
కమనీయమౌ సామగానరవము

వాక్కు శాసించి యార్షసంపద్విశిష్ట
భారతేతిహాసమ్మును భవ్యదృష్టి
నాంధ్రమొనరించుచును కంటివమృతసిద్ధి
ఆదికవి ! మానమస్కృతులందుకొనుము.

ఆంధ్రజాతి మను
        నంతవరకు నీ
యాంధ్రభాష నిలుచు
        నంతవరకును
అజరామరమౌ
        యశఃకాయమున
ఆదికవీ ! మహి
        మోన్నతి నుందువు.

జయము జయము
        వాగనుశాసన !
జయము జయము
        కవితా విశారదా !
జయము జయము
        ప్రథమాంధ్ర మహాకవీ !
జయ మవిరళ
        జపహోమ తత్పరా:—

# ఆదికవీ!

రాజరాజ మకు
టస్థిత ర
త్నామలకాంతి వి
రాజిత చరణా!
యజన యాజనా
దీక్ష షట్కర్మా
చరణ ప్రాప్త ద
యాంతఃకరణా!

విదితాఖిల శా
స్త్రపురాణసము
చ్చయ నానార్థ
ప్రతిభా జలధీ!
నిగమాగమ సా
రావగాహనో
ద్దీపితార్థ రుచి
సూక్తి నిధీ!
జయ జయ జయ
నన్నయ
మహాకవీ!



# విషయసూచిక

## జీవితము.

జీవిత మొక

నృత్యశాల

జీవన మొక

సుఖవేల

పటు పరివ

ర్తన విలసిత

చటుల దీప్తి

సంశోభిత

పటుతర భావ

విభాసిత

తటినీ స

న్నిభవిస్తృత॥

కారుణ్య

రసావేష్టిత

కమనీయ

ప్రభావాంచిత

విషాదాంతః

కరుణ సహిత

వరణీయ

ప్రమోద భరిత

జీవిత మొక

నృత్యశాల

జీవన మొక

సుఖపరిల



# వి శ్వ వీ ణ



భా ర తీ !

కను విప్పి నంతనే
కమనీయ దృశ్యముగ
కలము కదపిన యంత
కల్యాణ గాథగా
పెదవి మెదపిన తోనె
హృదయ మధుర పదముగా
ఎద కదలికల లోనె
సుధ జాలువారగా
వర మిమ్ము భారతీ !
కరుణించు భారతీ !—

లోకమంతయు నా వి
లోకనము లోనుగా
లోక మెల్లెడల నీ
లోకమ్ము వీడగా



## వి శ్వ వీ ణ

లోకు లందరు నా వి
    లోకనమ్మున సరిగ
లోక మంతట సౌహా
    ర్ద శ్రీ చె ల ం గ గా
వరమిమ్ము భారతీ !
    కరుణించు భారతీ !—

లోకమంతయు శాస్త్ర
    దృష్టి నవలోకింప
లోకమంతయు తత్త్వ
    దృష్టినే వీక్షింప
లోకమంతయు కళా
    మయముగా దర్శింప
లోక నిర్మాణ చి
    త్రమ్ము వివరమ్మరయ
వరమిమ్ము భారతీ !
    కరుణించు భారతీ !—



## నా కవితకు.

వినువీధిని

తారకలు

వియన్నదీ

వీచికలు

ప్రణయజీవి

కోరికలు

ప్రగతి శీలి

వేదికలు

ఉత్సాహం

నా యూహకు

ప్రోత్సాహం

నా కవితకు.

అంబుదముల

వితరణము

అంబుజముల

వికసనము

అంబుధి నిర

త ధ్యానము

# విశ్వ వీణ

కంబుకంఠి

కలస్వనము

ఉత్సాహం

నా యూహకు

ప్రోత్సాహం

నా కవితకు.

లోచన గో

చర జగతి

లోకనమున

కందని గతి

లోకపు సం

కీర్ణ దృష్టి

ఈ విశాల

మహా సృష్టి

ఉత్సాహం

నా యూహకు

ప్రోత్సాహం

నా కవితకు.

## విశ్వ వీణ

కనిపించే
ఈ విశ్వంలో
కని పించని
దెంతో ఉన్నది
కని, పెంచే
దాని కంటె
ఘనమైనది
ఇంకే మున్నది ?

అతి లావ
ణ్యో పేతంగా
అత్యంతం
విలక్షణంగా
అనంతమౌ
శూన్యం కాచిన
అత్యద్భుత
ఫలమే విశ్వం.

బంధుత్వం
　　కలదోయ్ నీకు
భావింపగ
　　భువనంబంతతో
సంబంధం
　　విస్తరింపవోయ్
సౌఖ్యం నిం
　　డారు జగతిని.

గతము మరచిపో
　　దగింది కాదోయ్
గతపరిణతి ఆ
　　గతమ్మరయవోయ్
గతాగతమ్ముల
　　గ్రహించి యోచన
ననాగతమ్ముకు
　　పునాది వేయుము.

# విశ్వ వీణ

వికసిత నవ
    కుసుమం రీతి
ఉజ్జ్వలమౌ
    రత్నం భాతి
విస్తారిత
    దివ్యజ్యోత్స్నగ
వచ్చావోయ్
    ఈ భువనానికి.

వెదజల్లుము
    పరిమళమంతా
విరజిమ్ముము
    ప్రకాశమెంతో
వెలయింపుము
    ఈ విశ్వంలో
వెన్నెల చలు
    వలచే ప్రశాంతి.

## నీ వెవడవు?

ఆకస మంతట
  నటు గజిబిజిగా
ఆణి ముత్యముల
  న ల్లిశ్రద్ధగ
పరాకు వలనన ?
  చిరాకు చేతన ?
పారబోసి కొం
  టివి నీ వెవడవు ?

అనంతమౌ శూ
  న్యమ్మున నొంటరి
ననవరతము వి
  శ్రాంతి నెరుంగక
బొంగరములుగా
  భూమ్యాదుల ని
ల్లింపముగా త్రి
  ప్పెదు నీ వెవడవు ?

## నీ వెవ డవు?

క్షణ పరివర్తన
    శీలమ్ముగ నీ
జగతి విచిత్రము
    గా విరచించీ
అణుసముదయ స
    మ్మేళనమున న
త్యద్భుతముగ మా
    ర్చెదు నీ వెవడవు?

ఎంతకాలము గ
    తించిన గానీ
సుంతయైన మా
    ర్పె యెరుగని నీ
వింతపరికర
    మ్ములనెంతో వి
భ్రాంతిగొల్పు చుం
    డెదు నీ వెవడవు?



## అణువు

ఆనందదాయియై
లేదా ?
ప్రత్యణువు
ఆదరణ పాత్రమ్ము
కాదా ?
అఖిల ప్రపంచమ్ము
నిఖిల సౌభాగ్యమ్ము
అణుగర్భమున నణగి
లేదా ?
ప్రత్యణువు
ఆరాధనీయమ్ము
కాదా ?—

విశ్వజీవన కళా
విలసనమ్మునదియు
విశ్వేశు నంశయై
లేదా ?

ప్రత్యణువు
విశ్వ సంసేవ్యమ్ము
కాదా?

అనుకూలగమనయై
అనవరత ఖేలనను
ఆమోదమునె కోర
బోదా?
ప్రత్యణువు
ఆనందమునె చేరు
గాదా?



## న క్ష త్ర ము లా రా !

అంతరిక్షమున
　　మిన్కు-మిన్కు-మను
అసూనమౌ న
　　క్షత్రములారా !
ఆశ్చర్యాన్విత
　　మౌ నా మదిలో
సంశయములు
　　తీరుస్తారా ?-

నక్షత్రమ్మొక
　　లోకమ్మంటూ
నానాప్రముఖులు
　　నుడివెదరు
ఇది నిజమేనా ?
　　అయితే నాదొక
మనవిని మీ
　　రాలిస్తారా ?-
మాలోకమువలె
　　మీలోకములో
మనీషులౌ మా
　　నవు లున్నారా ?

# నక్షత్రములారా!

నానా భాషలు
కలవా? అచ్చట
నిఖిలజంతు సం
తాన మున్నదా?-

పరివారములు
పరితోషములు
పరివేదనలు
కలవా? అచ్చట
పాలనమున్నద?
ప్రజాతంత్రమా?
పార్థివులం
డున్నారా?-

మహీధరములు
మహానదములు
మహార్ణవములు
కలవా? అచ్చట
సుందరతరమౌ
ప్రకృతియున్నదా?
సూర్యచంద్రు
లున్నారా?-



## క ళా వృ ష్టి

అణుపణువున
సృజన శ క్తి
అణు కణమున
ప్రళయ శ క్తి
అ ఖి ల వి శ్వ
మున గననౌ
న ద్భు త మౌ
క ళా సృ ష్టి.-

ప్రాగ్దిశ ప్ర
త్యూషమ్మున
ప్రాభాత స
మీర మ్మున
భాస్కరు నా
గమనమ్మున
పరమాద్భుత
క ళా వృ ష్టి.-
అవ్యాహత
మవ్యయమ్ము
దివ్యమునౌ
కాలమ్మున

## కళావృష్టి

అహోరాత్రు
లయనమ్ములు
అతి విచిత్ర
గణనమ్ములు.—
విరజాజులు
విను వీధిని
విరజిమ్మిన
కరణి దోచు
నుజ్జ్వల న
క్షత్ర రాశి
నద్భుత కౌ
శలమొప్పును.-

క్షణ పరివ
ర్తన శీలము
కణ పరివ
ర్ధన మూలము
అణు సముదయ
సమ్మేళన
మనితర మీ
ఖేలనమ్ము.—

## అ హ ం త

నే నే

విశ్వమును

కా ను

విశ్వమ్మున

నే నొకడను

ఏ మహి మా

న్వితశ క్తినో

ఈ ష ణ్మా

త్రపు నలుసును.

అవధిలేని

వ్యవధి గనని

అడ్డెరుగని

కాలాబ్ధిని

అనవరత

మ్మీదులాడు

అనూనాణు

కణమునునే.

# అహంత

శరదిందు
వికాసమ్మును
చంద్రార్కుని
తేజమ్మును
నక్షత్రో
జ్జ్వల కాంతియు
నాలో గల
వేలేశమె.

ఈ విశాల
విశ్వ భవన
నిర్మాణము
కౌశలమున
నే ననుపమ
మౌ నుపమను
తొలి పరికర
మును నేనే.

# వి శ్వ వీ ణ

నిఖిలాంశలు

నాలో గల

సఖిలమ్మున

నేను గలను

నాకు లేని

దేది లేదు

నేను లేక

నేది కాదు.



## నే ను

నే నను వ్యక్తిత్వ మొకటి
నా యను కర్తృత్వ మొకటి
నా యను సత్త్వ మొకటి
అమరిన వివి యేనాడో !-
అమరిన వే హేతువుననో !-

కన్నుల గాంచిన సర్వము
వీనుల విన్నది యెల్లను
మనసున కందిన దంతయు
మరి తలచగ నేను గాను.

నా దన్నది మున్నెవరిదో
ముందిక నెందరిదానో
ఎన్ని రీతులుగ మారునో
ఏ యే రూపము లందునో !

నా కలలన్నిటి లోనను
నే నను మన్నిటి యందున
నా కంటెను భిన్న మొకడు
నే గనజాలను భువిలో.



అధికు లెవరు కానరారు
        అధము లంచు లేనె లేరు
అహ మందరిలో నొకటే
        అసమానత గననేరము.





# అవ్యక్తము

నే గాంచనిది
నే దలంచనిది
నా యూహల కం
దనిది సమస్తము
నాది కాదంచు
నే దలంచుటలు
నా కవ్యక్తము
గా మది దోచును.

నే గాంచిన
సర్వమ్మునకు
నే దలంచు
సర్వమ్మునకు
నా యూహల
సర్వస్వమునకు
ఆధార
మ్మదిగా దోచును.

# విశ్వ వీణ



ఈ తరులకు
గిరులకు ఝరులకు
ఈ నరులకు
ఇతర జీవులకు
ఈ దినకర
శశి తారలకును
ఆధార
మ్మదిగా దోచును.

ఈ యనంత
విశ్వమ్మునకును
ఈ యగాధ
కాల మహాబ్ధికి
నా యంతః
కరణమ్మునకును
ఆధార
మ్మదిగా దోచును.





## నన్ను మించినది

నన్ను మించిన దేవో
నా లోన గలడు
కన్నాకుగా నెంతో
తిన్నగా నన్నరయ॥

అన్ని తానై యుండి
యెన్నో తా నగుచుండి
అన్ని రీతుల నుండి
యెన్న నొకడై యుండు॥

అన్నిటను తా నుండి
అన్ని తనలో నుండ
ఎన్నడేని యొకింత
హెచ్చు తగ్గులు కనని॥

అణు కణమ్మున కన్న
నతి సూక్ష్మమగుచు దా
నఖిల విశ్వమ్ము నకు
అనపాయ హేతువై॥

## జి జ్ఞా స

ఈ లోకము వీడిన న
న్నేలోకము పిలుచునో
ఆలోకమ్మున నాలో
నేయంశలు మిగులునో.

నను వీడిన ఆప్తులచట
నన్గలియగ వత్తురో
తమవారల కుశలమ్మా
తురత విచారింతురో.

ఇహమునగల తమవారల
కరుణనరయ నెంతురో
ఈలోకపువారికి దమ
కేపొత్తు దలంపరో.

ఈలోకపు జీవతతికి
ఆలోకపు రూపులేవో
ఆలోకమ్మందున నవి
యే కరణి చరించునో.

# జి జ్ఞా స



ఆలోకపు రూపున నే
        నీ లోకము కనగలనో
ఏ యవలోకనమున నా
        కేగతి కాన్పించునో.
మరియొక లోకము కలదో
        మరిలేనే లేదొ యికను
మమతలు సమతాసమతలు
        మహి వీడగనే మాయునో.
ఈ విశాల విశ్వమంత
        నా విహారమున కేనో
ఇహసుఖ వాంఛాపూర్తియె
        ఈ జీవిత పరమార్ధమొ.





# ఈ లోకాలన్నీ ఒకటే

ఈ లోకమ్మెంతో నాకు
ఆలోకమ్మంతే నాకు
ఆలోకనమే సరియైతే
ఏలోకమ్మైనా ఒకటే.

ఈ లోకమ్మున నావారే
ఆ లోకమ్మున నున్నారు
ఏ లోకమ్మున కేగిననే
నా లోకమ్మంతా నాదే.

గతిలో ముదమెంతో నాకు
క్షతిలో ముదమంతే నాకు
గతమున సుఖమెంతౌను అనా
గతమున సుఖమంతే నాకు.

## ఈ లోకాలన్నీ ఒకటే

అనుభవమున నాకొక్క లోకం

అనితర వర్తనమీ లోకం

క్షణ పరివర్ధన మీలోకం

క్షణ పరివర్తన మీ లోకం.

ఈ లోకమ్మున నాలోకం

ఆ లోకమ్మున నీలోకం

ఆలోకనమే సరియైతే

ఈ లోకాలన్నీ ఒకటే.



## నా కే మి తె లి యు ను

ఆత్మ ప్రదక్షిణము
లే క్షణము మొదలిడెనో
క్షణమేని విశ్రాంతి
నే యెరుగదీ యవని.

రాత్రిం దివము లెట్టు
లారంభ మాయెనో
అంతమే కనబడదు
ఎంత కాలముకేని.

ఆకసమ్మును గనగ
నాశ్చర్య మొదవును
తుదియేమొ మొదలేమొ
తోచ దెక్కడ గాని.

గ్రహ తారకాదు లే
క్రమమున నిల్చెనో
అంతు బట్టదు మన
శ్చింత మిగులునె గాని.

## నాకేమి తెలియును

**************************************************

పంచ భూతముల శా

సింప జాలిన దేదో

బోధపడ దిసుమంత

బుద్ధి కెపుడే గాని.

నేనంచు నాదంచు

నుడువు చుండుటె గాని

నన్ను నే నెరుగని

నాకేమి తెలియును ? —



**************************************************

## ప్రపంచము

ప్రపంచ మొక
పద్మ వ్యూహం
ప్రజాళి భే
దక సందోహం.

తమసాచ్ఛాదిత
సత్త్వా పూరిత
రజో గుణాన్విత
ప్రజాకోటి యుత॥

లోహపాశ సం
బద్ధ తామసులు
స్వర్ణ శృంఖలా
బద్ధ సాత్త్వికులు
వివిధపాశ వే
ష్టిత రాజసులు
వ్యూహ భేదన మె
రుంగని వీరులు॥

# ప్ర పం చ ము

త్రిగుణాతీతులు
ప్రాజ్ఞులే
త్రైకాలాంత ర
సాక్షులు సం
ప్రథితాత్ములు సమ
చిత్తులాత్మద
ర్శనులీ వ్యూహ
మ్మును భేదింతురు
ప్రపంచ మొక
పద్మవ్యూహం
ప్రజాళి భే
దక సందోహం.



## అం తా మి త్రు లే

అంతా మిత్రులె
నీ కీ జగమున
నంత శ్శత్రుల
నీవు జయించిన,
అంతులేని ఐ
శ్వర్య వంతుడవు
సుంత దైన్యమెరు
గని ధీమంతుడ॥

ఆదిత్యుడు నీ
కనాది మిత్రుడు
మేదినియా నీ
కనుంగు జనని
మోదమ్మొసగును
అనిలము నీ కా
మోదమ్మొసగు ను
షోదయ మెప్పుడు॥

# అంతా మిత్రులే

సుధాకరుడు మది
రంజిల జేయును
విభావరియు ఆ
నందము గూర్చును
ప్రభాత మెంతో
హాయిని గొల్పును
ప్రభా కలితమై
జగమ్ము తోచును.
ఐరాబరులు
భూతకోటి సల్పును
పరామర్శ జగ
మంతయు సేయును
చరాచరమ్ములు
విరామ మెరుగక
పరాకాష్ఠ నీ
సేవను కన్గొను॥



## ఎవరు నీవు?

క్షణమున కొక
వేషము వేయుచు
కణమున న
ద్భుతమును జూపుచు
కమనీయముగా
కానుపించుచు
కర్కశత్వమును
చవి చూపింతువు
కరుణామయివా?
కఠిన హృదయవా?
కన్నతల్లివా?
కాక పిశాచివ?

లాలనతో పరి
పాలన జేయుచు
చాలగ మాపరి
పోషణ జూచుచు

# ఎవరు నీవు?

******************************

చిలితోడ పరి
తోష మొసంగుము
కాలమెరిగి కా
యమ్ము హరింపుము
కరుణామయివా ?
కఠిన హృదయవా ?
కన్న తల్లి వా ?
కాక పిశాచివ ?

ప్రసన్న వదనం
ప్రచండ హాసనం
సుచారు హాసం
విహార హృదయం
వినోద నృత్యం
విలయ తాండవం
ప్రమోద మొసగెదు
భయమ్ము గొల్పెదు
కరుణా మయివా ?
కఠిన హృదయవా ?
కన్న తల్లి వా ?
కాక పిశాచివ ?

******************************

## దేని కదేనా?

దేనిపని దానిదేనా ?

ఈ జగతి

దేనికది దానికేనా ?—

అనల మ్మనలము నక ?

అనిల మ్మనిల మునక ?

అవని తన కొఱ కేన ?

ఆకసమ్మం తే న ?

అంబుధులు తమకొఱక ?

అంబుదము లంతేన ?

చంద్రుడూ సూర్యుడూ

చెందుదురు తమకేన ?

ఈ తరులు ఈ గిరులు

ఈ ఝరులు తారకలు

ఇవి యన్ని తమకు దా

మవసర మ్మయ్యేన ?



# అన్యోన్యము

ఎంతో సొంపున్న గల
వింతయా ప్రభాకరుతో
అంతులేని సంబంధము
అఖిల విశ్వమున కున్నది.

చలువల వెదజల్లుచు వన
చెలువమ్మున జగతి దన్ను
చలువరేని సంబంధము
చలువ విశ్వమున కున్నది.

సన్నజాజు లాకసమున
చల్లిన చందమున దోచు
ఎన్నరాని తారల పొ
త్తెన్ను విశ్వమున కున్నది.

పొంగు నిజతరంగ హ

స్తమ్ముల నాట్యమ్ము సల్పు

సింధు సౌఖ్య సంధాయక

బంధుత్వం బవని గలదు.

నే నొకడను నాకేమను

నను వారించు నికేమను

నాకగు నితరుల నేమను

నా తలపజ్ఞాన మౌను.

అర్థ రహితమైనది ని

స్వార్థ సిద్ధి గననిది సం

బంధితాత్మ గాన్గిది ఈ

పృధ్విని గనరా దొకటియు.



# భా గ్య వ ం తు లే

భాగ్య వంతు
　　లే యంబర
భాగ్యు లెవరు
　　లేరు జగతి॥
ఈ నము లీ
　　సంద్రమ్ములు
ఈ సూర్యుడు
　　ఈ చంద్రుడు
ఈ న క్ష
　　త్రము లన్నీ
ఏ యొక్కరి
　　సొమ్ము గావు॥

ఈ పవన
　　ముమ్ము ధరిత్రి
ఈ తరు లీ
　　గిరులు ఝరులు

ఈ యనంత
　　మౌ నాకస
మే యొక్కరి
　　సొమ్ము గాదు॥
స్వార్థ కలిత
　　దృష్టిని పర
మార్థమ్మును
　　గనని నరులు
అ ర్థ స ం చ
　　యాపేక్ష ని
రర్థకులను
　　సృష్టిం తురు.

భాగ్య వంతు
　　లే యంద ర
భాగ్యు లెవరు
　　లేరు జగతి.

******************************************

## ఇంతేనా?

ఇంతేనా?

ప్రపంచ మంటే

కొంతేనా?

ఇది కాకుంటే.

నదీ నదాలు

సుందర తరులు

గిరులు ఝరులు

సరోవరాలు

పుష్పిత లతలు

సప్త సముద్రాల్

వేవెలుగు రే

వెలుగు చుక్కలు

పవలు రాత్రులు

వెలుగు చీకటులు

ప్రణయ రహస్యాల్

ప్రళయ గర్జనలు

******************************************

విలయ కృత్యములు
విరస వర్తనలు
విభిన్న దృష్టులు
విరుద్ధ శక్తులుఁ
అంతర్లీనం
గా ప్రవహించే
అన్నిటి దనతో
ననుసంధించే
అన్నిటి దనలో
నను బంధించే
అనన్యమౌ
శక్తి యొకటి లేదా ?



## ర జ నీ!

వెలలేని ముత్యముల
   వెలయించి రెవరు ? నీ
అలి నీల వేణి నో
         ర జ నీ!

విలువైన ముత్యముల
   తల ఁ్రాలచే నెవరు ?
చెలువమ్ము గూర్చిరో
         ర జ నీ!

అసితాసిత చ్ఛవియె
   అవకుంఠ ముగను నీ
కమరిచిన వారెవరు ?
         ర జ నీ!

అసదృశమ్మైన యా
   శశి శిరో భూషగా
నొసగి రెవ్వరు ? నీకు
         ర జ నీ!

నీ శిరో భూషణము
 నిత్య మ్మొకే రీతి
చేసిన ట్లుండ దో
 ర జ నీ !

నీ శిరో భూషణము
 నిత్యమ్ము మార్పిటుల
చేసి పెట్టెద రెవరు ?
 ర జ నీ :

అనతి నీరవ విభవ
 మనుగతమ్మౌ చెలిగ
వినుతపథ గమన ! ఓ
 ర జ నీ !

లలిత పద చాలనో
 దిత శ్రీ శ్రుతా జనిత
కలితేందు మణిశిఖా !
 ర జ నీ !

## ర జ నీ !

********************************************

అసమాన మౌ కాన్క-
  నీ యుషో మణిని నీ
కొసగు చుండెద రెవరు ?
    ర జ నీ !

అతి రమ్యమౌ కాన్క-
  నటు తృణమ్ముగ నెంచి
యెట కేగి వత్తువో
    ర జ నీ !

ఎంత కాలము నుండి
  యెంత మందికి నీవు
వింత గొల్పితి విట్లు
    ర జ నీ !

ఎంత కాలమ్మిటుల
  నింత వైభవముతో
వింత గొల్పుదు వింక
    ర జ నీ !



********************************************

## ఒకదినము - ఒకక్షణము.

వేచి యున్న దొక
దినము
నాకై
కాచి యున్న దొక
క్షణము.
వేదనలను తొలగించి
నా
వాదనలను సమయించి
ఆదరమున నించి
కృప న
న్నాదు కొన దలంచి
పొంచి॥
ఆశయమ్ములను త్రుంచి
నా
ఆశల నన్నిటి ద్రెంచి
ఆశల నన్నిటి ద్రెంచి
ఆశ్రితునిగ నన్నెంచి
కృప నా
కాశ్రయమ్ము కల్పింప
దలంచి॥



## ఒక వేళ

ఎవ రెంత
    గానొ బరు
        వొకవేళ

మది దూది
    మై పోవు
        నొకవేళ

హృది నిండు
    ముదము నా
        కొకవేళ

పదిలమ్ము
    తప్పు హృది
        నొకవేళ॥

విననౌను
    యేదొ నా
        కొకవేళ

వినరాదు
    మరల నిం
        కొకవేళ

కననౌను
        అదియె వే
                రాకవేళ
కనరాక
        పోవు నా
                కాకవేళ॥
దరినేదా
        తోచు నా
                కాకవేళ

దరిలేని
        దని తోచు
                నాకవేళ
బహు దూర
        మనిపించు
                నాకవేళ
బహి రంత
        రమ్మదియ
                యొకవేళ॥



## బ్రహ్మానందము

ఆనందం
    ఆనందం
ఆనందం
    పరమానందం
విశాల విశ్వ
    మ్మవలోకింపగ
ఆనందం
    బ్రహ్మానందం.

తల్లీ పిల్లల
    చల్లని ప్రేమను
ఉల్లము విరిసే
    ఆనందం
భార్యా భర్తల
    పరస్పరత గన
భావము పొంగే
    ఆనందం॥

వృక్షమ్ములపై
    పక్షుల గనగా
అక్షీణమ్మగు
    ఆనందం.

కొండలపై
మెండౌ మేఘమ్ములు
నిండించును హృది
నానందం.
విహాయసము గన
నానందం,
విద్యుల్లత గన
నానందం,
విభావరిని పర
మానందం,
ప్రభాతమున
బ్రహ్మానందం.

అణు ఖేలనమున
నానందం
తను చాలనమున
నానందం
మనుగడలో పర
మానందం
కనుగొనుటే
బ్రహ్మానందం.



## అనంత విశ్వము

శూన్యోద్భవ సుందర దృశ్యం
విచిత్ర మీ అనంత విశ్వం
అవధి రహితమౌ కాల గమనం
వ్యవధి రహితమౌ విశ్వ భ్రమణం॥

అణు ఖేలన మహద్విలాసం
తనుచాలన ప్రాణి కలాపం
దినకర శశి తారాగమనం
దివారాత్ర గమనాగమనం॥

శరదిందు వికాస జ్యోత్స్న
చండార్క ప్రచండ తీక్ష్ణతా
సుఖదమ్మౌ మలయానిలము
శుష్కమ్మౌ గ్రీష్మానలము॥

విహాయసపు టూహా పథము
విరుద్ధమౌ ఘాతల విధము
పరస్పరపు టనురాగమ్మౌ
భయావహమ్మౌ క్రోధమ్మౌ॥

శమ దమ యుశమౌ నాత్మ ప్రయత్నం
 శ్రమ కేంద్రీకృత పశుబల యత్నం
అనవరతమ్మో సమరస యత్నం
 అనితరమౌ నీ విరస వర్తనం॥

ఆశార్ణవ తరణాశయము
 పైశాచిక లీలా వరణము
అనన్యమౌ నీ సమాకర్షణము
 అనూహ్యమౌ నీ వ్యపకర్షణము॥



## ఏ స్థితి గలరో !

విశ్వాబు సముదయమ్మున
        నెవరెవ రే స్థితి గలరో !
గతి నందిన ప్రియజీవు లనా
        గతులౌ నాత్మీయులు॥

పంచ భూతములలో నే
        యంచనమం దున్నారో ప్ర
పంచ జీవరాశిని ఏ
        యంశలవా రున్నారో॥

ఏ యవిదిత విశ్వశక్తు
        లెటుగొని పోయెనో వారల
నీ విదిత ప్రపంచమున
        నెవరే గతి నున్నారో॥

అవగతమౌ జగతి గలరో
        అన్యమునం దున్నారో
అఖిల విశ్వ వలయములో
        నిఖిలమ్మున తాము కలరో॥



## ఎ వ రై నా ?

చూచినార ?

ఎవరే నెపు డైనా ?

చోద్యమైన

శూన్యమ్మున కెల్లలు !

కనుగొన్నారా ?

కాల గమనమున

కవధి యెచటనో

వ్యవ ధెన్నటికో !

గుర్తించారా ?

గ్రహ సముదాయము

కలిమి బలిమి

హేతువైన దేదో !

అరసిరె ? ఈ

అద్భుతమౌ సృష్టిని

అనంతోద్భవ

మ్మైన సాంతముగ.



# మ న ము

కను విప్పుడు
మొక తీరుననే
మను చుండుము
ఒక యనువుననే
కను మూయుదు
మొక వైఖరినే
కను చిత్రము
కననౌ నైక్యము.

అనుకూలమె
పరమాప్తతగా
అమరికయే
పరమాప్తునిగా
ఆనందమె
పరమావధిగా
ఆశయముల
కననౌ నైక్యము.

ఆహార విహా
రమ్ముల లో
ఆచార విచా
రమ్ముల లో
ఆమోద విషా
దమ్ముల లో
అద్భుతముగ
కననౌ నైక్యము.

లతా జనిత కిస
లయముల రీతిని
వనధి వీచికా
సముదయ మ్మటుల
అనంతమౌ నే
కైక శక్తి యం
దంశా మాత్రుల
మే మన మౌదుము॥



**************************************************

# అ వ గా హ న ము

అనూహ్య మౌ

సృష్టి రహస్యమ్మున

క వ గా హ న

మాత్మ దర్శనమ్మున.

అహం భావమున

కాది యెచటనొ ?

అహం కారమున

కంతం బెచటో !

జ ని పూ ర్వ ము

వృత్తాంత మదేమో ?

చ ని పో వ గ

మిగులునదౌ నేమో !

ఏ యంశల నే

నరు దెంచితినో ,

ని ఖి లా ం శ లు

నాలో గలవేమో !

**************************************************

శూన్యమ్మున కా
　　వల నే మున్నదో ?
శూన్యమ్మున గల
　　చోద్యమ్మేమో !
దివారాత్రాను
　　గమన మ్మేలనో ?
అహోరాత్రముల
　　యనుసంధతకో !
ది వ ము రా త్రి
　　యొకటా నెన్నటికో ?
లయము నందు నీ
　　సృష్టి యెన్నడో !
కనజాలగ వా
　　రెవరే నుందురో ?
కనుగొనసప్పుడే
　　మియు నిక నుండదో !
సృష్ట్యాదిని గల
　　వస్తు వదేమో ?
సృష్ట్యంతమ్మున
　　మిగులున దేమో !



 

## విశ్వ కావ్యము

ఈ మహా కావ్యమున
నెచట నేమున్నదో
నా యూహ కది
యందునా ?
ఎప్పుడైన
నే నంతయును
కందునా ?।

ఈ యణువు గోళ మవ
నికి గాను యింతలో
గ్రహామండలము
లుండెనా ?
వేరుగా
నెదియొ కారణ
ముండునా ?।

ఈ దిఙ్నభో వ్యాప్తి
యిటు లేగి యటు సాగి
ఎచటనే సాంత
మౌనో

ఎప్పుడే
నెచట సొంతమ్ము
కా దో ?-
ఈ యఖిలమైన బ్ర
హ్మాండమ్ముతో నాదు
సంబంధ మెపు
డెట్టిదో !
ఈ తీరు
ననుబంధ మెంత
వ ర కో !-
ఈ విశ్వ కావ్యమున
కితివృత్తమైన వే
రొ క వి శే ష
మ్ము న్న దో ?
తనకు దా
నిదియె వృత్తాంత
మౌ నో !-



## ఎవరిచ్చిన ఉద్యోగము ?

ఎక్కడిదయ్యా :
    నీ కీ వెలుగు ?
నిక్కముగా వచి
    యింపు సూర్యుడా !
మక్కువతో నడుగు
    చుంటి చెప్పుము
ఎక్కడి దీ చలువ
    నీకు చంద్రుడ !
ఎటగాని రీ యు
    జ్జ్వలతన్ నాకడ
నిక దాచకు డో
    తారకలారా !
ప్రాలుమాల కిటు
    గోల పెట్టుదువు
పాలింతురు ని
    న్నెవరు సంద్రమా !

అనిలమ ! నే జన
        పున బ్రశ్నింతును
ఆజ్ఞనుంతు రెవరు
        నిన్ను ? చెప్పుమా !
ఎంతదాక వ్యా
        పించితివో నా
కంతు దెల్పు మొ
        క్కింత గగనమా !
దివి భువి జవసం
        పన్నత నుంతురు
ఎవరిచ్చిన ఉ
        ద్యోగము మీకిది ?—



# సాలోచనము

నా చూపునను దోచు
　　నీ దివారాత్రములు
భూచరమ్ముల వరకె
　　　　ఏమో!
నా చూపు గనని యే
　　ఖేచరమ్ములకొ ఇక
నీ చూపు వేరౌనొ
　　　　యేమో!
నా మానసమ్మెంచు
　　నీ విశ్వభావనము
నాతోటి నరులకే
　　　　నేమో!
నా మానసాతీత
　　మీ విశ్వభావన
మ్మేయితర ప్రాణి చెటు
　　　　లౌనో!
నాకు వినసైన నా
　　నా రవమ్ములు జగతి
నేజీవి కెటుల విన
　　　　నౌనో!

నాకు కననైన నా
నా దృశ్యతతి జగతి
నేజీవి కెటు కాన
నానో :

ఈ విశ్వమున నింత
లింతలౌ ప్రాణు లిటు
లే చిత్ర సంకలన
నానో :

ఈ విశ్వమున నింత
వింత సంకలనమ్ము
సంకల్ప మేశక్తి
దానో :

ఈ నిఖిల విశ్వ ని
ర్మాణ హేతుకమైన
సంకల్ప మొకటున్న
దేమో :

ఈ నిఖిల విశ్వ ని
ర్మాణ పరిణతి లోని
పరిణామమే యానొ
ఏమో :—



## ఉదార చరితులు

అంబుదములు గై

కొను నీరమ్ముల

నంబుధిలో, నది

తమ కొఱకౌనా ?

చంద్రుడు గైకొను

కాంతి సూర్యునిది

చంద్రిక చంద్రుని

కొఱకే యౌనా ?

వృక్షమ్ములు ఫలి

యించు ఘూస్థలి న

పేక్ష సుంత దమ

కొఱకు సేయునా ?

పుష్పమ్ముల జీ

మ్మక సౌరభమును

శుష్కమౌ స్వా
ర్థమ్ము నెంచునా ?
ఉదార చరితులు
పరి గ్రహింతురు
ఉర్వి నర్థ సం
తర్పణ సేయగ.



# అహము, అహంకారము.

నా
అహమ్మున
కంత మేమున్నది ?
నా
అహంకృతి
కింత యేమున్నది ?
నలు వలంకులను నే
నను జూచినాను
నా గురుతు తెలియలే
కేమరచి యున్నాను॥

విశ్వ మంతా నేను
గా విస్తరించాను
వేరుగా నన్నెంచి
వెతల బడుచున్నాను॥

విశ్వవిభు నంశగా
నే వెలసి యున్నాను
విస్మృతాబ్ధిని మున్గి
విలపించు చున్నాను॥



సచ్చిదానంద ల

క్షణ లక్షితుడ నేను

సాక్షి మాత్రుడ గాక

సంకెలల జిక్కితిని॥





## వసుధైక పతాక

ఈ మండల
        మంతా ఒకటే
భూమండల
        మంతా ఒకటే
భూతలమున
        కంతకు నొకటే
కేతన మిక
        నే నిర్మిస్తా.

ఖండమ్ముల
        నన్నిటి నొకటే
జెండా క్రిం
        దికి నే తెస్తా
పొందికగా
        నిక కూరుస్తా
అందముగా
        నవి మారుస్తా.

అంతరమున
        నైక్యము జూపి
సంతన లో
        సౌఖ్యము దెలిపి

అందరి నొ
　　క్కటి చేసేస్తా
పొందిక సౌ
　　ఖ్యము చూపిస్తా.

జగ మంతకు
　　వేవెలు గొకటే
జగ మంతకు
　　రేవెలు గొకటే
జగమౌ నవి
　　భాజ్యమ్మనకే
జగమౌ సమ
　　భోగ్యమ్మనకే.

ఇదియౌ నిక
　　శాంతి పతాక
ఇదియౌ నిక
　　దాంతి పతాక
ఇదియౌ నే
　　కైక పతాక
ఇదియౌ వసు
　　ధైక పతాక.

****************************************************

## నా ప య న ము

ఒంటరిగా

నా పయనం

నా పయన

మ్మొంటరిగా

ఎంతగ నలి

గిన బాటనో

ఒంటరిగా

నా పయనం.

ఎందరెంద

రో యేగిరి

ఎందెందున

కో యేగిరి

ఎవరికి వా

రే యేగిరి

ఈ బాటనె

యీ సూటినె॥

దారి నెవరు

తార సిలిరో

****************************************************

తారే తమ

కుగ నేగిరో

తీరుగ నా

తో పచింప

తిరిగియె రా

రాక రేనియు

ఒంటరిగా

నా పయనం

నా పయన

మ్మొంటరిగా.



## సత్ర శాల

ఈ సత్ర శాలలో
　　ఎవరి కొఱకై నేను
వేచి యుంటిని యిటుల
　　కాచి యుంటిని యిచట॥

ఎంద రెందరొ వచ్చి
　　యిందె విడిసిరి నాతో
ఎందరే తెంచినను
　　ముందుకొను నిరీక్ష॥

నను గలియవలె నెవరు?
　　నే గలియవలె నెవరి?
నెంత వరకు నిరీక్ష?
　　అంత మెపుడు ప్రతీక్ష?॥

నను దరియ వచ్చునా?
　　నే దరికి పోదునా?
దారి దూరమ్మౌన?
　　దరినె కాన్పించునా?॥



## ని త్య సం తో ష ము

ఇంతతోనె నే
    నంత మ్మైతే
అంతకన్న కా
    వలసిన దేమి ?

అంతులేని గమ
    నమ్మిది యైతే
అంతకన్న కా
    వలసిన దేమి ?

పంతగించి విధి
    వైర మ్మూనిన
అంతకన్న కా
    వలసిన దేమి ?

అంతా నా కను
    కూల మ్మైతే
అంతకన్న కా
    వలసిన దేమి ?



# ఉప కరణము

నే తెలిసి కొన్నాను
    నే తెలియు చున్నాను
నీ లీల యిది యనుచు
    ఏల నిక దిగులనుచు—
నీ వున్నతుడ వనుచు
    నిను మించ రెవరనుచు
నీవు సముడవు ననుచు
    నీవె నన్నిట ననుచు-
నాలోన నీవనుచు
    నీలోన నేననుచు
నీవు సకల మ్మనుచు
    నే సకలమున ననుచు-
నా మనో భావములు
    నావియే కావనుచు
నీ ప్రేరణము లనుచు
    నే నుపకరణ మనుచు-



## ఒ క్క టి యే

జ్యోతి ర్మయ
కిరణ లేశ
మొక్కటి నా
హృదయమ్మున
ఒక్కటి నీ
హృదయమ్మున
ఒక్కటె యణు
గర్భమ్మున.
నూత్న కళా
విలసనమ్మ
ఒక్కటి నా
యానమున
ఒక్కటి నీ
యానమున
ఒక్కటె లో
కావరణను.

# ఒ క్క టి యే

*************************************************

చేతో ముద
    మొనగూర్చును
ఒక్కటి నా
    కెల్లప్పుడు
ఒక్కటి నీ
    కెల్లప్పుడు
ఒక్కటి యె
    ల్లరకెప్పుడు
ఒక్కటియే.



*************************************************

## హా ద్దు లు

అస్తిత్వమ్మన నేమో ।
నా యీ
వ్యక్తిత్వమ్మన
కాది యెప్పుడో ।
ఆదియెపుడో నా
అస్తిత్వమునకు
ఆరంభం
అపుడేనా బాల్యం ?
భవ్యమైన నా
యౌవ నోదయం
బాల్యమ్మునకౌ
నితిశ్రీ యేగా ।
అంతమౌచు నా
యౌవన మెప్పుడు
కౌమారోదయ
కారణ మగునో ।

## హద్దులు

***************************************************

కౌమారాంతమె
కారణమ్మగా
వార్ధక్యం
ఆరంభమ్మగునా ?–
ఆదియౌను
దేనికి నా మరణం ?
ఆదు కౌనును
దేనిని నా మరణం ?
ఇన్నిన్నిగ నే
మేని యున్నవా ?
అన్నిటి కటనట
హద్దు లున్నవా ?



***************************************************

## వేద వాక్యము

అంతా నాదే
యీ భాగ్యం
అంతా నాది
మహా భాగ్యం॥

అంతులేని నా
ఐశ్వర్యంలో
అవనియౌను ఒక
అణు వూహింపగ॥

ఆదిత్యం డొక
అణువౌ నటులే
మోదమొసగు పర
మాణువు శశియౌ

ఆదర మొసగెడు
అణువులు తారలు
వాద రహితమౌ
వేద వాక్యమిది॥

## వే ద వా క్య ము

**************************************************

కన్నులు గాంచని
మన మూహించని
దెన్నగ జాలని
దున్నది సర్వము
అంతా నాదే
యీ భాగ్యం
అంతా నాది
మహా భాగ్యం॥
అంతా నాలో
నే నంతటి లో
చింతన గననౌ
నెంతో సత్యము
అంతా నాదే
యీ భాగ్యం
అంతా నాది
మహా భాగ్యం॥

